# FOREWORD

I am pleased to see the plan-bearing play-let, " Melukolupu " which received special prize in planninq " Song and Drama " Seminar.

It is rather difficult to fuse the multifarious aspects of planning into a regular dramatic theme, and still more so to do the same without losing sight of popular taste. I am happy to write the fore-word for this play which achieved this remarkable object.

I wish this young writter a sunny literary future and expect more from him.

/19-4-59.

*M. A. I. A. S.*
*Collector, Khammam.*

# "ప రి చ య ము"



1958–59 సంవత్సరమున "ఆంధ్ర ప్రదేశ్" రాష్ట్ర ప్రణాళికాభివృద్ధి శాఖచే ఆయా జిల్లాయందు నిర్వహింపబడిన "సంగీత నాటక సదస్సు" నందు పంచవర్ష ప్రణాళికాభ్యుదయకర కార్యాలంకృతమై, ప్రత్యేక బహుమతి నందుకొని, ప్రజామన్ననల నొందిన "మేలు కొలుపు" నాటిక, యుగత నిదుర యందున్న జాతిని అప్రమత్త మొనర్చుట యందుచిత పాత్రను నిర్వహించుట మిక్కిలి ముదావహము.

యువక రచయితలగు శ్రీ జి. సూర్యనారాయణరావు గారు, ప్రణాళికా ప్రచారోపయుక్త సాహిత్య సృష్టియంద నవరత కృషిసాగించి, జాతికి యితోధిక సేవగావింతురని ఆసించెద.

(Sd.) సందా సుబ్బరాయుడు, B. A.,
Dist. Planning Officer, Khammam.

# "అంకితము"

లలితరో !

పొగడ పూరేకు విచ్చిన పగిది నాలో
మొగ్గ విడుస్మృతీ రేకుల నిగ్గులోన
తీయ తెలిమంచు వెన్నెల తీవవోలె
తళతళల తోచి నాపయి దాగితీవు.

అట్టికాంతులు కన్నుల ఆగిపోయి
అట్టి యనుభూతి ఎడదన నాడిపాడి
నీవు నేనుగా నాలోన నీవు ! వెలుగ
కొన్ని భావన లీనాడు కూర్చికొంటి.

లలిత ! నాతొలిభావన మలచిమలచి
రాగరేఖలొ పొదిగితి ఆగలేక
కొనవె మదాత్మకింపుగ కూర్మి ! సుమము
తరతరాల సంబంధ బాంధవ్య మిదియ !

నిన్నులోకాన స్థిరముగ నిల్పుకొఱకు
నిన్నునాలోన యెప్పుడు నిల్పుకొఱకు
మల్లెపూవంటి ప్రణయ సుమాలదూసి
మాలలల్లితి లలిత ! సుమాలు గొనుము !

# పాత్రలు



| | |
|---|---|
| 1. కృషీవలుడు | వెంకయ్య |
| 2. అమాయకరైతు | నాగయ్య |
| 3. నిస్వార్థుడు | కార్యకర్త (V. L. W.) |
| 4. నీతిమంతుడు | బడిపంతులు |
| 5. అభ్యుదయకాంక్షిణి | విమల |
| 6. సనాతనురాలు | రామమ్మ |
| 7. బాలవితంతువు | వెంకాయమ్మ |

# ప్రార్థన



'స్వాగతం'

1. స్వాగతంబు ఆర్యులార !
స్వాగతంబు ఆంధ్రులార !

**స్వాగతం !**
సు స్వాగతం !

2. భరతమాత పుత్రులార !
భాగ్యనగర వాసులార !
స్తంభాద్రిగ్రామ ప్రజలారా !

స్వాగతం !
సు స్వాగతం !

3. రాజకీయ విదుషులార !
జాతీయవాదులార !
సాహితీ పరులారా !

స్వాగతం !
సు స్వాగతం !

4. భరతమాత పుత్రులార !
భావిభరత పౌరులార !
నవయౌవ్వన యువకులార !
స్వాగతం !
సు స్వాగతం !

5. కలలుగనిన స్వాతంత్ర్యం !
లభియించిన దీనాడే !
కోట్ల ప్రజల శ్రమఫలితం !
లభియించిన దీనాడే !

తనవి తీర
యనుభవింప
గైకొనుడీ స్వాగతం !
సు స్వాగతం !



బోలో స్వతంత్ర భారత్ కూ
జై ! జై !

# మేలుకొలుపు

## (నాటిక)

### రంగము - 1

నేపథ్యం:—(అది యమ్. యల్. ఏ. సూర్యారావుగారి బంగళా. డ్రాయింగ్ రూములో మేజు, దానిమీద రేడియో కేసు, దాపున రెండు యీజీఛైర్లు, వాటి ముందు ఒకస్టూలు, దానిపై ఫ్లవర్‌వేజ్ అమర్చబడి వుంటుంది.

(సరిగా సాయంత్రం 4 గం॥ సమయం)

(నేపథ్యంనుండి - బడిగంట వినబడుతుంది)

విమల:—(ప్రవేశించి, చేతిలో స్కూలు పుస్తకాలు మేజు మీద పెట్టి) పిన్నీ! రేడియో తాళంచేతులు యెక్కడున్నవే?

నేపథ్యం:—రేడియో వెనకనే వున్నై అమ్మలూ.

విమల:—వెధవతాళంచేతులు! యెంతవెతికినా దొరకవేం?

నేపథ్యం:—అమ్మలూ నీకెందుకే అంత విసుగూ - కాస్త వోపికతో చూడరాదూ!

విమల:—వెధవ తాళంచేతులను ఇక్కడెవరుండ మన్నారూ? (తాళంచేతులు పుచ్చుకొని కేసు తెరచి, రేడియోను 'ట్యూన్' చేసి ముంగురులు దువ్వుకుంటూ, అద్దం ముందు నుంచొని, టాయిలట్ చేసుకుంటుంది వయ్యారంగా.)

నేపథ్యం :— ఆలిండియా రేడియో
విజయవాడ కేంద్రం
'సుగమ సంగీతం'

పాడుచున్నది – 'వేణుగోపాల్'
మ్యూజిక్ – వెంకటాచార్య బృందం.

## "మేలుకొలుపు"

1. మేలుకో సోదరా!
నువు మేలుకో సోదరా!
ఇక మేలుకో సోదరా!

2. పస్తులెన్నో పండి మనము
వత్తులై పోయినాము;
మగతనిదుర పోయిమనము
మందగించి పోయినాము

ఇకనైనా మనమింకా
వెలుగుత్రోవ త్రొక్కుదాము. ॥ మే

3. స్వాతంత్ర్యం వచ్చిందీ
బరువులెన్నో తెచ్చిందీ;
పథకాలను రచియించీ
పడనిపాట్లు పడుతున్నది.

ఇక మనము లేవకున్న
మనకున్నది ముందుసున్న. ॥ మే ॥

4. నడుముకట్టి పలుగుపట్టి
అడవికొట్టి నదులుకట్టి
సారమైన భూములనూ
సాగుచేసుకోటానికి. ॥మే॥

విమల:—పాట అప్పుడే ఐందే? ఆహో యెంత యింపుగా వుందీ! (ఇంట్లోకిచూచి) పిన్నీ! కాఫీ ఐందటనే?

నేపథ్యం:—స్టౌ వెలిగించా అమ్మలూ! ఐదు నిమిషా లాగు.

విమల:—ఇంకా ఐదు నిమిషాలంటావేమే? తల బ్రద్దలవు తుంటేనూ-

నేపథ్యం:— పేపర్! పేపర్!

నేపథ్యం:—అమ్మలూ! పేపరు కుఱ్ఱాడొచ్చినట్టున్నాడు. అందుకో అమ్మా!

విమల:—(లోనికివెళ్ళి, పేపరందుకొనివచ్చి పేపరు అటూ ఇటూ తిరగేస్తూ) తాజావార్తలేంటో! (అంటూ యీజీ చైరులో కూర్చొని)

యేమిటీ! ఖమ్మంజిల్లాలో పంచవర్ష ప్రణాళిక అమలా! కో ఆర్డినేషన్ మీటింగ్ వివరాలా! (జారిన సాస్కిన్ పమిటను సద్దుకుంటూ)

విషయాలు చాలా ఇంటరెస్టింగ్‌గా వున్నట్లున్నవే (పేపరు చదువనారంభించి)

జిల్లాకలెక్టర్ సమావేశ ప్రారంభములో కేంద్రప్రభుత్వమునుండి చేరిన అత్యంతప్రధానమగు జి. వో. ను సభాసదుల దృష్టికి తెస్తూ-

"వెనుకబడియున్న ప్రాంతముల అభ్యున్నతి నిమిత్తము కేంద్రప్రభుత్వము పంచవర్ష ప్రణాళిక పద్దునుండి మన జిల్లాకు 20 లక్షల రూపాయలు కేటాయించుచూ, ప్రాంతీయాభ్యుదయకర కార్యములను మరుక్షణమే ప్రారంభించి, సాధించిన క్రమాభివృద్ధిని రాష్ట్రప్రభుత్వమునకు తెలుపుచూ నేరుగా మాసవారీని వేదికల రూపమున కేంద్రమున కంద జేయవలసినదిగా కోరుట జరిగినది"

కాన జిల్లాధికారులగు మీరు యావన్మంది మీమీ శాఖలందుగల యవసరములను తెలుపగలరని కలక్టరు కోరుటయు, అంత **విద్యాశాఖాధికారి:**

మనజిల్లాయందు ఏజన్సీ ప్రాంతములుగ పరిగణింప బడుచున్న బూర్గుంపాడ్, పాల్వంచ తాలూకాలు, కోయ, చెంచు, లంబాడీ మొదలగు జాతులకు పుట్టినిల్లై విద్యా సంస్కారము లేక మిక్కిలి అంధతమస్సునందు కొట్టు కొనుచున్నవనియూ, ఆయా ప్రదేశములందు విరివిగా పాఠశాలలు స్థాపించి సమర్థవంతముగ నిర్వహింపబడుచూ విద్యా సౌకర్యములను ప్రజల కందుబాటు నందుంచినగాని, నిరక్షరాస్యత నిర్మూలింపబడి మన్యప్రజ లభివృద్ధిచెంది జిల్లా యొక్క సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడ జాలుదురనియూ కాన అధికమొత్తములను విద్యాశాఖకు కేటాయించవలసినదిగ కోరుటయూ;

నేపథ్యం:- విమలా ! కాఫీకి రావేమే ? చల్లారి పోతుంటే-

విమల:- అబ్బ! మాంచి ఘట్టంలో వున్నప్పుడే-యేదో డిస్ట్రబెన్సు—వస్తూనాన్న పిన్ని! (మరల పేపరు చదువ నారంభించి) అంత సివిల్ సర్జన్:—ఆహా! (యీాయన గారుకూడా వున్నారూ-) పిండిపాలవల్లనూ, హోటలు టిఫన్లవల్లనూ, దినదినమూ పెరుగుచున్న వ్యాధులకు, యెప్పుడూ "ఔట్ పేషంట్లుగానే కాని, ఆశ్రయమిచ్చి నివారింపజాలని అధ్వాన్న స్థితిలోనున్నవి నేడు జిల్లా మొత్తములోనున్న ఆసుపత్రులు. కావున జిల్లావ్యాపితముగ ఉచితవసతి సౌకర్యములుగల ఆసుపత్రులను నెలకొల్పవలసిన యవసర మెంతైననూ కలదని, ఇందునిమిత్తము అధిక మొత్తములను ఆరోగ్య శాఖకు కేటాయించవలసినదిగా కోరుటయు; (విమల పేపరునుండి ముఖముత్రిప్పి) (సివిల్ సర్జన్, డి. ఇ. వోలు వున్నదున్నట్టు నిర్భయంగా, యెంతముక్కుసూటిగ చెప్పారూ-అధికారులంటే యిలావుండాలి! (మరల పేపరు చదువ నారంభించి)

అంత కలక్టర్ నిరక్షరాస్యతా నిర్మూలన జాతి సౌభాగ్యమునకు మూలకందముగాన 8 లక్షలు విద్యాశాఖకూ; ప్రజల జీవనప్రమాణ పాటవమును పెంచుఛే పంచవర్ష ప్రణాళిక ప్రథమాశయముగాన అధికాహారోత్పత్తి సాధనకై 5 లక్షలు వ్యవసాయ శాఖకూ; ఆరోగ్యరక్షణ, మానవాళి మనుగడకే అత్యంతా వశ్యకముగాన 3 లక్షలు ఆరోగ్యశాఖకూ;

రెండేసిలక్షలు రహదారి రక్షణశాఖలకు యిందు మూలముగ కేటాయించనైనదనియు, ఇట్లొసంగ బడిన ద్రవ్యమును ఉచితరీతియందు వినియోగించ వలసినదిగా తాకీదు చేయుటయు జరిగినది.

విమల :—(పేపరు స్టూలు మీదుంచి) ఇంతకూ పోటీలో మన డి. ఇ. వో గారే గెలిచారే! ఐతే యీ సంవత్సరం మా బడికి "నల్లా" తప్పకుండ వస్తుందన్న మాటే !!

నేపథ్యం :—అమ్మాలూ! కాఫీకి పిలిచి యేజామైందే, చప్ప చల్లారి పోయిందిగదా! మళ్ళీ వెళ్ళి చదువుకో కూడదూ! పేప రెక్కడికన్న పారిపోతుందా యేమిటే!

విమల :—వస్తున్నా పిన్నీ.

(విమల ఇంట్లోకి వెళ్ళుతుంది తెరపడుతుంది)

## రంగము - 2

(అది ఒక పూరి గుడిశ. రైతు వెంకయ్య, చుట్టము చూపుగా వచ్చిన నాగయ్య, ఇంటిముందు పండ్ల పుల్లలను నములుతూ పిచ్చాపాటి మాట్లాడుకుంటూ దూరమునుండి వినవస్తున్న పాటను ఆలకిస్తూ వుంటారు.)

నేపథ్యం:—(బడిపంతులు చెప్పగా, ప్రతిచరణము బాలురు ముక్తకంఠంతో పాడతారు.)

1. కోడికూయంగనే నిదురలేవాలీ
కొత్త పాఠంబులు చదువాలీ,

అమ్మకూ, నాన్నకూ మ్రొక్కాలీ
అబ్బాయికీ ముద్దు లివ్వాలీ, ॥కో॥

2. చక్కగ స్నానము చేయాలీ
తెల్లని దుస్తుల వేయాలీ;
చలిది అన్నము మెక్కాలీ,
తిన్నగ బడులకు పోవాలీ. ॥కో॥

3. దైవ ప్రార్థనా చేయాలీ,
నేరుగ తరగతి చేరాలీ; ॥కో॥
పలక పుస్తకము తెరువాలీ,
పాత పాఠములు వ్రాయాలీ. ॥కో॥

4. చెప్పిన పాఠము చదువాలీ,
చదివిన వన్నీ వ్రాయాలీ;
సాటి వారితో మెలగాలీ,
సఖ్యత నెంతో పెంచాలీ. ॥కో॥

నాగయ్య:—వెంకయ్య బావా! యాడినించే ఆ పాట వినస్తాందీ!

వెంకయ్య:— యాడినించంటా వేందిరా! మదర్సా నించైతే నో!

నాగయ్య:—బావా! తేలీకడుగుతా! యీడ మదర్సా యెన్నడు పెట్టింరు.

వెంకయ్య:—ఎన్నడు పెట్టింరంటా వేందిరా! యాడా దైతేనో!

నాగయ్య:—మావూళ్ళోనే అంటే! యీడా పెట్టింరూ!

వెంకయ్య:—మాపల్లె అంటే అంత తీసేసి మాట్లాడుతున్న వేందిరోయ్? ఔనుగాని నాగయ్యా! మాటొచ్చింది గాబట్టి సెపుతుండా—మావూరి పంతు లెంత మంచో డనుకున్నా! యేందేందో పేపరు విసయాలంటా, సూపరెరువులంటా; యేస్తే మా మంచిపంట పండుత యంట! జపాను సిట్టమంటా వరినాటుతే! ఫోత రించి పండుతయంటరా! మా మంచి విసయాలు చెపుతడ్ లే.

నాగయ్య:—జపాను సిట్టంతో వరి బాగాపండుత దంట; నిబద్దేనా బావా!

వెంకయ్య:—ఇందులో అబద్ధమేముందిరా! యీ యేడేగా-మావూరి పటేలుజపాను సిట్టంచేత్తే, ఓ!పంటపండింది! నాసామిరంగా! బిగానికి మూడుపుట్లైతేనో!

నాగయ్య:—నిబద్దేనా బావా!

వెంకయ్య:—నీయెట్టి దొంగలు తోలా! అంతా నిబద్దేరా!

నాగయ్య:—ఐతే యంకయ్యబావా! నాకా పంతుల్ని సూద్దామనుందే!

వెంకయ్య:—అంత సద్దితిన్నాక సూద్దాంలే.

(ముఖం కడుక్కునేందుకు బావివద్దకు పోతారు)

(చద్దితిని వెంకయ్యా, నాగయ్యా, చుట్ట తాగుతూ వసారాలో కూర్చొని వుంటారు)

పంతులు:—(ప్రవేశం) ఏం వెంకయ్యతాతా! ఇంటికెవరో చుట్టాలొచ్చినట్టున్నారూ!

వెంకయ్య:—దండాలయ్యా! దండాలూ
నాగయ్య:—కూర్చోండి బాబయ్యా! (నాగయ్య గుడిశ లోనించి స్టూలుపీట తీసుకొని వస్తాడు)
వెంకయ్య:—(చుట్టను ఆర్పేస్తూ) జింవసెడ! యీచుట్ట మా కతిబాబయ్యా, పెద్దా, సిన్నా వున్నారని కూడా సూడసీదూ.
పంతులు:—యేమీ ఫరవాలేదు తాతా. పెద్దవాడివీ, అందులో అలవాటూ...
వెంకయ్య:— పంతులు గోరూ - యీడూ మా బామరిది లేండీ; యీరోజే వచ్చిండు. మీరు పెందలకడ సెప్పుతున్న పాటుందే—విసీ! మాచెడ్డ మురిసి పోయిండు. మిమ్ముల సూత్తానంటే; యిప్పుడే బైల్ దేగాలను కుటుండం; యింతలో మీరే వచ్చింరు.
పంతులు:—ఔనుగానీ — మాటల సందట్లో అడగటం మరచా—మీ మనమడు మల్లయ్య బడికిరాలేదేం!
వెంకయ్య:—యేంలేదు బాబయ్యా! వాడి మా మొచ్చిం డనీ, కుశాలిమీద ఆటిడిపు పెట్టిండు.
నాగయ్య:—అయ్యగోరూ! యీ బడీ—యెన్నొద్దులిన్నించి పెట్టింరండీ యీడా—తేలీకడుగుతా.
పంతులు:—ఒక సంవత్సర మైతున్నది.
నాగయ్య:—మాతాతలిన్నించి లేందీ యిప్పుడెందుకు పెట్టిం రండీ.
పంతులు:—నాగయ్యా! పూర్వం మనదేశం యింగ్లీషు వారి చేతుల్లో వుండేది. ఇప్పుడు మనకు స్వాతంత్రం

రాగానే, జాతి కల్యాణమునకు మూలకందమగు విద్యా సంస్కారమును కలుగజేసి, జాతి సౌభాగ్యమునకై పంచవర్ష ప్రణాళికలను జేపట్టి, స్వతంత్ర ప్రభుత్వ మీా యేర్పాట్లు చేసింది.

నాగయ్య :—పంచ వర్స పనాలికంటే యేందండ్రీ!

పంతులు :—అంటే — దేశము పొందవలసిన అభివృద్ధిని కొన్ని భాగములుగజేసి, ఐదు సంవత్సరములలో యింత అభివృద్ధిని సాధించవలెనని నిర్ణయించుకొని, దానిని సాధించి, జాతిని కొన్నాళ్ళకల్ల సిరిసంపద, శాంతి సౌభాగ్యములందు తులతూగించ గలందులకై ప్రభుత్వము నందలి పెద్దలు రచించిన ఒక పథకము.

నాగయ్య :—ఔనుగాని అయ్యగోరూ! దీనిక్రింద యేమి సేత్తరండీ.

పంతులు :—నాగయ్యా! దీనికిందగాదు. దీనిని ముందు పెట్టుకొని, పల్లెపల్లెకూ పాఠశాలలు స్థాపించి ప్రజలను విద్యావంతులను చేయుటా — ప్రజల సహాయమున పల్లె పల్లెకూ రోడ్లు వేయించుట ; రైతు బిడ్డకు సహాయ నిమిత్తము సహకార సంస్థల నెలకొల్పి, విత్తనములూ, రసాయనిక యెరువులూ, అప్పులూ; అందజేసి అధికాహారోత్పత్తిని సాధించి, పొట్టనిండ తిండీ, వంటినిండ బట్టా, వుండుటకు ఉచితమగు గృహావసతి కల్పించుటా; పల్లెపల్లెకూ ఆసుపత్రులను నెలకొల్పి, ఉచిత చికిత్సా సౌకర్యముల కల్పించి,

ప్రజలను మహామారి వ్యాధులనుండి రక్షించుటా, బావులు చెరువుకట్టలూ నిర్మించి, ఉత్తమ నీటి పారుదల సౌకర్యములను కల్పించి బంజరు భూము లను సాగునకు తెచ్చుటా;

నాగయ్య;—బావా ! యింటున్నవా !

వెంకయ్య:—యెఱ్ఱిమొగమా! నువ్వేందిరా, పానకంలోపుడక మాదిరీ ! సెప్పండి బాబయ్యా ! సెప్పండి.

పంతులు:—నదులకు ఆనకట్టలు నిర్మించి, వ్యర్థమైపోవుచున్న నీటిని సాగునకు వుపయోగపరచుటా; విద్యుచ్ఛక్తిని సాధించి, తద్వారా భారీపరిశ్రమలను నెలకొల్పి పారిశ్రామిక రంగమున దేశమును ముందుకు గొని పోవుటా; మొదలగు దేశాభ్యుదయకర కార్యము లెన్నియో సాధించబడును.

నాగయ్య:- ఇంత పెద్దపనులెట్లు జరగాలి బాబయ్యా !

పంతులు:- పల్లెప్రజలగు మీరు యావన్మందీ, కూడికట్టుగ నడుం బిగించితే! యింతేమిటి మనప్రభుత్వం కొండల్ని పిండిచే సెయ్యదూ...

వెంకయ్య:- నిజమే బాబయ్యా ! ఇంతకూ మాకు బుద్ది లేదు. ప్రభుత్వానికేం బాగానే సేత్తుండది. ఇంతకూ ఓడు యేటికి తీత్తే, రెండోడు కాటికి లాగుతా డాయ్ ? ఏంసేద్దుం బాబూ ! మాకర్మంతే.

పంతులు:— వెంకయ్యా ! అట్లు అధైర్య పడకు. మీలో ఐక్యతను సాధించి, కలసి కట్టుగ తేగలందులకు

గ్రామసముద్ధరణ కార్యకర్తలు, గ్రామ గ్రామములూ తిరిగి అహోరాత్రములు పనిచేస్తున్నారు. మీ రాత్రినికి తోడుగా నున్నచాలు. మీ గ్రామములు భూతల స్వర్గంగా మారుతై.

మాటల ధోరణిలో మరచానూ - బడి బైమైంది గానివెళ్లి వస్తా! మీ మనమడ్ని రేపన్నా పంపించు వెంకయ్యా !

వెంకయ్య:— సిత్తం ! సిత్తం !

నాగయ్య:— సెమించాలి బాబయ్యా ! మీకు కట్ట బెట్టాం.

పంతులు:- మీరలా యెన్నడూ అనుకోవద్దు. తెలియనివి ప్రజలకు తెలుపుటే బడిపంతులు ధర్మం.

(తెరపడును)

## రంగము - 3

(అది ఒకపల్లెటూరు పెంకుటిల్లు. ముందు సాయబానా. అరుగుమీద చాప. దానిపై యిద్దరు విధవలు రాట్నాలు వడకుతూ మాట్లాడుకుంటూ వుంటారు.)

(రంగం ప్రారంభించుటకు ముందు)

నేపథ్యం :—మేలుకో శ్రీరామా
మేలుకో జయరామా
మేలుకో పట్టాభిరామా ॥మే॥
అరుణోదయము మీరె
అంధకారము బారె
అండాజ వాహన ॥మే॥

సుకపికములు నిన్ను
స్తోత్రమొనరించెను
సుందరా విగ్రహా ॥మే॥

రామమ్మ:—(ప్రవేశించి) (పక్కింటి ఆవిడను పిలుస్తుంది) వెంకాయమ్మా! కాసేపు వచ్చిపోరాదటే! అంత దారం వడుకుక్కుందాం.

వెంకాయమ్మ:—వస్తున్నా! బామ్మ గారూ - (అంటూ రాట్నం తీసుకొని ప్రవేశిస్తుంది)
(ఇద్దరూ కూర్చొని రాట్నం వడుకుతూవుంటారు)

వెంకాయమ్మ:—ఔనుగాని బామ్మగారూ! తెల్లవారు జామున బావివద్ద యేదో మేలుకొలుపు పాడుతున్నారు. యెంతబాగున్నదండీ! ఐనా బావివద్ద కెందుకొచ్చారూ!!

రామమ్మ:—అహాఁ యేమీలేదే! కార్తీక సోమవారం కాదటే! కృత్తికా స్నానంచేస్తూ, యేదో అంత రామ నామ స్మరణచేసుకుంటున్నా: అంతే? యింతకూ మా పాటలన్నీ పాత చింతకాయి పచ్చడైనవే. ఇప్పుడు నచ్చుతయ్యా?

వెంకాయమ్మ:—నాతోడు బామ్మాగారూ! చాలా బాగుంది. పనికి పనీ ఐతుంది, పుణ్యానికి పుణ్యమూ దక్కుతుందీ: ఒక్కసారి పాడుదురూ!

రామమ్మ:— వెంకాయమ్మా! కాస్తపడిశ భారంగా వుంది! రేపు చూద్దాంలే!

వెంకాయమ్మ:— ఐతే బామ్మ గారూ! సీతమ్మ గారి ప్రమీలకు-తొలుచూరు కాన్పటగా?

రామమ్మ:— యేమోలేవే పాపం!

వెంకాయమ్మ:— అదేంటి బామ్మ గారూ! అలా అంటున్నారూ!

రామమ్మ:— అంభాళా దేవిలా వుంటుందే పిల్ల. ఇంతకూ కన్నవాళ్ళను చూచుకొనే అదృష్టం వుండాలిగా!

వెంకాయమ్మ:—అదేంటండీ! వున్నవిషయం చెప్పరేం? యేమి జరిగిందీ?

రామమ్మ:—వెఱ్ఱిబాగుల దానిలా వున్నావేమే! హాయిగా పట్టణంలో వున్నదాన్ని వుండనియ్యాక, తొలిచూరు చూలాలుకదా అని, ఖమ్మంనించల్లా యిక్కడికి, నిన్నకాక మొన్న పురిటికి తీసుకొచ్చారు. యే! చెడు వేళలో బయలుదేరారో! యేమో! పాపం నిన్న సాయంత్రంనుంచీ నెప్పులు రావటం! అగిపోవటం! పిండం అడ్డం తిరిగిందిట కూడా! యీ వేళకు ఐపోయే వుంటుంది.

విమల:—శివ! శివ! యెవరమ్మా వాను?

(ప్రవేశించి తల్లికి సమీపంలో కూర్చుంటుంది)

రామమ్మ:—యెవ్వరూలేదే! నీస్నేహితురాలే! ప్రమీల.

విమల:—ఏమే! అమ్మా! నీకేమన్నా మతిపోయిందా యేమిటే! మెటర్నిటీ వార్డులో ప్రమీల చల్లగా ప్రసవించి, మొగ పాపాయిని కంటే! ఇప్పుడేగా నేనక్కడినించి వస్తా!

రామమ్మ :—"మెటరిటీ" వాటంటే యేమిటే? చెప్పే రెండుముక్కలూ, ముక్కుసూటిగా చెప్పరాదూ?

ఇంతకూ, ఖమ్మంలో మీబాబాయి దగ్గర చదువుకోని వచ్చిందెగ్గిర్నించీ? యెప్పుడూ కూని రాగాలూ, పీష్పూదిలాగా మొఖంనిండా మెత్తుకోటం! యేవో కాగితాలు తిరగేస్తూ వుంటావేగానీ! ఒక్కటీ సూటిగా మాట్లాడవు. అదో తరహా మారావేమే! చూశావా వెంకాయమ్మా! ఇంతకూ బ స్త్రీగాలి! కలికాలం న్యాయం! సరేగానీ! ఇంతకూ చెప్పావుకాదు, నీవన్న దేమిటే?

వెంకాయమ్మ :—బామ్మగారూ! బడినించి తమ్ముడొచ్చే వేళైందిగానీ, అన్నంపెట్టాలీ! వెళ్లివస్తా.

(వెళ్లిపోతుంది)

విమల :—అమ్మా! మెటర్నిటీ వార్డంటే ప్రసూతిగృహము.

రామమ్మ —అమ్మలూ! మనవూర్లో ప్రసూతి శాలెక్కడిదే

విమల :—అమ్మా! నీవు క్రీస్తుపుట్టింరోజుల్లో పుట్టాల్సిందానివే. సంవత్సరంక్రింద పంచవర్ష ప్రణాళిక ననుసరించి శిశు సంక్షేమ కేంద్రమూ, దాని కానుకొని ప్రసూతిశాలా, 30 వేల రూ. పెట్టి ప్రభుత్వంకట్టించి, అనేక కాన్పులు సుఖంగా ఐతుంటే యెక్కడా అని అంటావేమే ?

రామమ్మ:—చిట్టీ! యీసంక్షేమ సమితులు యెవరి పెత్తనం కింది వే?

విమల:—దీనికి పెద్ద శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్.

రామమ్మ:- అంటే! ఆరాజమండ్రావిడా?

విమల:—నీకెట్లా తెలుసమ్మా! ఆవిడ?

రామమ్మ:—ఎట్లాలేదే! మొన్న గోదావరీ పుష్కరాలకు స్నానానికి రాజమండ్రి వెళ్ళలా! అపుడు కోటిలింగాల దగ్గిర పెద్దసభ - యెవరికో దండలు వేస్తున్నారూ-యెవరని అడుగుతే యిపుడు నువ్వన్న పేరే అన్నారు.

విమల:—అట్లాగా!

రామమ్మ:—అమ్మలూ! తెలియక అడుగుతా-మన పల్లెలో యీ ప్రసూతిశాల కట్టేందు కింత డబ్బెక్కడిదే?

విమల:—దేశ సంక్షేమముకై, స్త్రీజాతి సముద్ధరణకై, మన ప్రభుత్వముచే పంచవర్ష ప్రణాళిక ననుసరించి కేటాయించబడిన సంపదనుండి.

రామమ్మ:—ప్రభుత్వం! యింతడబ్బిచ్చిందిగా చిట్టితల్లీ! నా ఆయుష్షుకూడా పోసుకొని. చల్లగా యీప్రభుత్వం వెయ్యేళ్ళు వర్ధిల్లాలితల్లీ! మాటల సందట్లో మరిచానమ్మలూ - పాలేరును పిలిచి అమ్మలు క్షేమంగా వూరుచేరిందని బాబాయికి జాబువ్రాసి పాలెంపోయి రమ్మనమ్మా?

విమల:—పాలెం మెందుకమ్మా!

రామమ్మ:—జాబు టపాలోవేసి రావటానికే!

విమల:— అమ్మా! యింకా నీకీచాదస్తం వదల్లేదా యేమిటే? పోస్టాఫీసు మన వూళ్లోనేవుంటే పాలెం వెళ్లమంటావేం!

రామమ్మ:—అదేంటే! అమ్మలూ. అదెప్పుడు పెట్టారూ—ఇంతకూ నాకీ వంటయింటినించి యీనాటివరకూ శలవు దొరక్కపోవటమే, బైటి ప్రపంచంలో యేమైతున్నదీ తెలియకపోవటం. ఇంతకూ యీ ఆడజన్మే పాడైన జన్మ.

విమల:—ఐతే యీరోజు నాతో బయలుదేరమ్మా! మనకు స్వతంత్రం వచ్చిన యీ కొలదికాలంలో పంచవర్ష ప్రణాళికను రూపొందించుకొని మనదేశం యెంత అద్భుతమైన అభివృద్ధిని చెందిందీ కళ్లారాచూపిస్తా! బయలుదేరుతావామరి?

రామమ్మ:—ఇంతకన్న నాకింకేం కావాలమ్మలూ! యిదే కాశీ, యిదే రామేశ్వరం! ఈకాస్త కనుచూపు తప్పకముందే, మేము అనుభవించజాలకపోయినా; కలకాలం వర్ధిల్లే మీ సుఖసౌఖ్యాలననా! కళ్లారా చూచి ఆనందించి! తరిస్తా తల్లీ! పద— యీరోజే మనగ్రామంలోని ప్రసూతిశాల, శిశుసంక్షేమకేంద్రం, పోస్టాఫీసూ చూసివద్దాం చిట్టీ.

## రంగం 4

(అది గ్రామముయొక్క నడివీధి. వేపచెట్టు క్రింద విశాలమైన అరుగు. అరుగుమీద యువకుడైన గ్రామ

సముద్ధరణ కార్యకర్త - అనేకమంది రైతులు గుమికూడి వుంటారు.)

(వేసవి కాలం - ఉదయం 9 గం. సమయం)

కార్యకర్త :—రైతు బిడ్డలారా! మీతో చెప్పవలసిన ఒక ముఖ్యవిషయం వుండి, ఇక్కడ మిమ్ముల సమావేశ పరచుట జరిగింది. నేను యిచటికి గ్రామసముద్ధరణకై మిమ్ముల ఆయత్తపరచి, పురోభివృద్ధి కార్యక్రమముల నిర్వహించు నిమిత్తము, పంచవర్ష ప్రణాళికాను సారమువచ్చి ఒక సంవత్సరం రమారమీ దాటింది. నేటివరకు మీరు యావన్మందీ, నాకందించిన హృదయ పూర్వక సహకార సానుభూతులూ— నాయెడల చూపిన ఆదరాభిమానములు; ఇంత యని చెప్పజాలకున్నాను. అందు నిమిత్తమే ప్రభుత్వ మొసంగిన ఆర్థికసహాయమును మన గ్రామమునకు ఉచిత రీతియందు అందించ గల్గినాను. మన గ్రామ మీనాడు, పోస్టాఫీసు, మెటర్నిటీవార్డు, శిశుసంక్షేమ కేంద్రం, వీధి దీపములు, సహకార సంస్థాశాఖలను కల్గి నిత్యకల్యాణముగ విలసిల్లుచున్నది. ఇక మన గ్రామమున కింకేమీలోటు లేదనుకుందును.

విమల :—(మంచినీటికై చేతబిందె నిడుకొని, అమ్మగారితో చెరువుకు వెళ్ళుతూ, దారిలో జరుగుచున్న ఉపన్యా సాన్ని ఆలకించి)
అమ్మా! అతనెవరో కాడే? పోస్టాఫీసు మొదలగు నవి మనగ్రామానికి తెచ్చుటయందు, గ్రామ ప్రజ

లను మేల్కొలిపిన మహాను భావుడు, "మనోహర్ రావుగారు"

రామమ్మ:— అమ్మలూ ! యేవూరే అతంది ?

విమల:— యేవూరైతే నేమమ్మా ? సంవత్సరంనుంచి మన వూరే. కానమ్మా ! ఉపన్యాసం యెంత ముచ్చటగా యిస్తాడనుకున్నావ్ !

రామమ్మ:— అట్లాగా! చిట్టీ ! మాకేం తెలుస్తుందే ? రామా ! కృష్ణా ! అనుకుండేవాళ్లకు.

(చెరువుకు వెళ్లతారు).

నాగయ్య:—మనోహరయ్యగోరూ! మీతల్లి కడుపు సల్లంగుండా - యాడినుంచి వచ్చింరోగాని - మావూరు పచ్చబడి ఇన్నాళ్ళకు మాకట్టాలు తీరినై బాబూ ! కాని ఒక్కటి చెయ్యాలిసుంది బాబయ్యా !

కార్యకర్త :—యేమిటది నాగయ్యా ? చెప్పావుకాదూ?

నాగయ్య:—ఆహా ! యేమిలేదు బాబూ - ఆ బస్సొత్తంది చూడురీ - ఆడినుండి మనపల్లెకు రస్తా విషయం చూసింరుకాదు. బాబయ్యా ! వర్సాకాలంలో పయానం సెయ్యాలంటే - నిబద్దిగ చెబుతున్నా బాబయ్యా! మాచెడ్డ చికాకు దొబ్బుద్ది.

కార్యకర్త:—నాగయ్యా! యీవిషయం నేను చాలారోజుల క్రితమే ఆలోచించా! P. W. D. వారొచ్చి రోడ్డు రంగనాధం దొరగారి పొలంగట్టుమీదనుండి సర్వే చేసి వెళ్లారు. అక్కడనుంచైతే ప్రజలశ్రమ మినహా

యించగా, కొద్దిముత్తంలోరోడ్డు పూర్తిఅవుతుందని రిపోర్టువ్రాశారు.

నాగయ్య:—ఐతే! ఇనొన్నద్దు లెందుకాగింది బాబయ్యా!

కార్యకర్త:—యేమీలేదు నాగయ్యా! రంగనాధంగారు పడనివ్వోద్దూ! తనగెట్టువద్దనుండి రోడ్డేస్తే తన భూమి నాలుగు గొలుసులు పోతుందని ఉజర్ పెట్టాడు.

నాగయ్య:—ఐతే! మాకు సెప్పారుకాదుబాబూ! తస్స తియ్యా! ఆడిన్ని యేనాడో ముత్తాలమ్మకు బలితీద్దుం.

కార్యకర్త:—ఆగు! ఆగు! నాగయ్యా! ఆవేశాలతోగానీ హడావిడ్లతోగానీ-పనులు కావునాగయ్యా! ఇన్ని పనులూ-ప్రేమాదరణలతో సాధించాం. లేనిపోని మడతపేచీలొచ్చి, కూడికట్టుగావున్న గ్రామప్రజలు, అశాంతికీ, అంతఃకలహాలకూ గురియై, స్వయం కృషితో చేసుకున్న మంచీ, సాధించిన గ్రామ కల్యాణం, బుగ్గిపాలౌతుందని, ఇది మీదాకా రానివ్వలేదు.

నాగయ్య:—ఐతే బాబయ్యా! ఒక్కడికోసం గ్రామా న్నంతా నట్టపడమంటరా మీరనేది!

కార్యకర్త:—అదికాదు నాగయ్యా! యీవిషయం, మన బి. డి. ఓ. దొరగారి దృష్టికితెచ్చాను. వారు జిల్లా కలెక్టరుగారికి వ్రాశానని తెలిపారు. ఈనాటికి సమా ధానం రావలసిందే! ఎందుకో జాగైంది. ఇంతకూ ప్రదక్షిణాలుచేసి కాగితం రావొద్దూ! మనం తొందర పడ్డట్టేనా-

నాగయ్య:— అదొచ్చేప్పటికి పున్యకాలం దాటేట్టుంది బాబయ్యా !

(నిశ్శబ్దం)

బాబుగోరూ ! నిన్న రంగనాథం గోరింటికి వెళ్ళినా— ఆడవారోరు పోలీసాయనతో "పిట్టకొంచెం, కూతగనం" అన్నట్టు, సూడటానికింత వున్నడో లేడో ! రైతులకు అదిసేశాం ! యిదిసేశాం ! అని, కల్లబొల్లి కబుర్లుసెప్పి, "మసిపూసి మారేడుకాయసేసి", రైతులను రెచ్చకొడుతుంరని గుసగుస లాడుతున్నరు ! అదేంది బాబయ్యా !

కార్యకర్త:—ఇందులో రెచ్చకొట్టేదేమున్నది నాగయ్యా ! ఉన్నవిషయాలూ—జరిగినపనులూ—పంచవర్ష ప్రణాళిక క్రింద గ్రామ సముద్ధరణకై, స్వతంత్ర ప్రభుత్వం చేస్తున్న వ్యయంగురించీ మాట్లాడు కుంటున్నాం.

నాగయ్య:—అంతేకాదుబాబూ ! పంచవర్స పనాలిక లనీ— అబ్యుదయ కారెకమాలనీ – డబ్బంతా జీపుకార్లకీ— దావత్‌లకీ పెట్రోల్ లాగా తగలేస్తూ – తెరెన్క— బాగోతంఆడుతున్నరనీకూడా—సెపుతుండు బాబయ్యా!

కార్యకర్త:— మాట వచ్చింది కాబట్టి అనక తప్పదు నాగయ్యా !

బజారు దీపం ఆతని చావడివద్దపెట్టించక పోవుటా? టప్పా పని ఆతని గుమాస్తాకు అప్పజెప్పక పోవుటా? మెటర్నిటీ వార్డు ప్రారంభోత్సవంనాడు కలెక్టరు

గారి యెదురుగా అధ్యక్షత పదవి ఆయనకు గాక నీకు ఒసంగుటా? నేను చేసినతప్పు? చారెడంత భూమి పోతుంది గదా అని, గ్రామానికిపడే సుక్షేత్రమగు రోడ్డును ఆపి వేసిన, ఆతని సాహసకృత్యం ధర్మకార్యం కాబోలు ? ప్రజలందరికీ వుపయోగపడేలాగా, గ్రామ కంఠంలోవున్న మోటబావికి సిమెంటుప్రహరీకట్టించి, ప్రజలందరికీ నీటి సదుపాయం చేయుటం, పాపకార్యం కాబోలు !

నాగయ్య :— ఇంతకాలం దాచిపెట్టింరు బాబయ్యా ! నాసామిరంగా యిప్పటికి బుర్రరామకీర్తన పాడేదే.

నేపథ్యం:—పోష్టు! పోష్టు!

కార్యకర్త:—(పోష్టు తెరచి, కాగితం చదువుచూ, కండ్ల నుండి ఆనందభాష్పములు కార్చును)

నాగయ్య :—(ఆదుర్దాగా)యేంది బాబూ ! కంట తడిపెడు తున్నరూ

కార్యకర్త :— (ఆనందోత్సాహాలతో) నాగయ్యా ! మన కష్టాలు గట్టెక్కినై, మనం అనుకున్నట్టే జరిగింది. కలక్టరు దొరగారు పోరంబోకుగా యున్న 420 నెం. ప్లాటును పరిహారంగా రంగనాథంగారికిచ్చి, వారి పొలంలోనుండి రోడ్డును మన గ్రామానకి వేసుకో వలసిందిగా జారీచేసిన వుత్తరువు, యీకాగితం. 20 వేల రూపాయలుకూడా మంజూరుచేశారు. నిజంగా

నాగయ్యా యీరోజు మనగ్రామానికీ! ప్రజాకృషికీ! ప్రజాస్వామ్యానికే ఘనవిజయం.

బోలో స్వతంత్ర భారత్ కీ !

జై ! జై !

రైతులు :—(రైతు లందరూ ముక్తకంఠంతో జయ జయ ధ్వానులు గావించుదురు).

కార్యకర్త—ప్రజాసోదరులారా ! ఇది వేసవి. పొలంపనులా లేవు. వర్షాలా వుండవు. రోడ్డు ఈ సమయంలోనే వేసుకోవాలి. వర్షాకాలం వరకు సిద్ధమైపోవాలి. "ఆలశ్యం అమృతం విషం" కాన జాగువద్దు. ఈ రోజే చాల సుభదినం. పని ప్రారంభిద్దాం.

రైతులు:—గుడిశలకెళ్లితట్టలూ-పారలూ తెస్తాంబాబయ్యా.

(రైతులు వెళ్ళుదురు)

విమల :—అమ్మా! వూరివాళ్ళందరూ రోడ్డు వెయ్యటానికి వెళుతున్నారే! చాలమంచి ఆడవాళ్ళుకూడా వెళ్ళుతున్నారు. నాకూసర్దాగావుంది వెళ్ళిరానా అమ్మా?

రామమ్మ :—వెళ్లిరామ్మా! వెళ్లిరా! వెంకాయమ్మను తీసుకొని నేనూ వెనుకనుంచి వస్తా ! తట్టలోకి అంత మట్టి అన్నా యెత్తుతాగా !

విమల:—సరే అమ్మా.

(కార్యకర్త, రైతులు రోడ్డువేయుటకు పాట పాడుకుంటూ బయలుదేరుతారు.)

నడవండోయ్! నడవండోయ్!
ఆంధ్ర యువతీ యువజనులారా!
నడవండోయ్!

తెలుగు మొగసల కదనరంగమై,
తెలుగు జోదులకు చరిత్రబలమై,
తెలుగు సీమ ఒక ప్రతీకారమై,
శంఖారావము ప్రతిధ్వనించగ
నడవండోయ్!

ఢిల్లీ సుల్తాన్ పట్టుకపోతాన్,
అని గర్జించిన యుగంధరుడు మన
ఆంధ్ర యువకుడని మరువక నేడే
నడవండోయ్!

ఢిల్లీ నగరపు లాల్ ఖిలాపై
చెన్నపట్టణపు లైటుటవరుపై
భాగ్యనగరపు ఫలక్‌నుమాపై
ప్రజాస్వామ్యమును నెలకొల్పుటకై
నడవండోయ్!

సెలవులు తప్పిన నీతినియమముల
గతులు తప్పిన న్యాయధర్మములు
నెలకొల్పుటకై నడుంకట్టమని
కార్యరంగమున ఖదం పెట్టమని
నడవండోయ్!





రచయిత:— జి. సూర్యం

కృష్ణాజిల్లా పరిటాల గ్రామమునందు జన్మించి, ఉస్మానియా విశ్వకళాపరిషత్తునందు పట్టభద్రులై ప్రస్తుతము ఖమ్మంమెట్టు బహుళార్థ పాఠశాలయందు ఉపాధ్యాయులుగ పనిచేయుట జరుగుచున్నది.

## రాబోవు ప్రచురణలు

1. అర్థశాస్త్రము
2. లాయర్ ఆత్మహత్య (ఏకాంకిక)
3. పేదబ్రతుకు ( ,, )